

ఓం వైష్ణవ్యై నమః
ఓం చంద్రికాయై నమః
ఓం చంద్రలేఖా విభూషితాయై నమః
ఓం సావిత్ర్యై నమః
ఓం సురసాయై నమః
ఓం దేవ్యై నమః
ఓం దివ్యాలంకార భూషితాయై నమః
ఓం వాగ్దేవ్యై నమః
ఓం వసుధాయై నమః
ఓం మహా భద్రాయై నమః
ఓం మహా బలాయై నమః
ఓం భోగదాయై నమః
ఓం భారత్యై నమః
ఓం భామాయై నమః
ఓం గోవిందాయై నమః
ఓం గోమత్యై నమః
ఓం శివాయై నమః
ఓం జటిలాయై నమః
ఓం వింధ్యా వాసాయై నమః
ఓం వింధ్యాచల విరాజితాయై నమః
ఓం చండికాయై నమః
ఓం వైష్ణవ్యై నమః
ఓం బ్రాహ్మ్యై నమః
ఓం బ్రహ్మజ్ఞానైక సాధనాయై నమః
ఓం సౌదామిన్యై నమః
ఓం సుధామూర్త్యై నమః
ఓం సుభద్రాయై నమః
ఓం సురపూజితాయై నమః
ఓం సువాసిన్యై నమః
ఓం సునాసాయై నమః

ఓం వినిద్రాయై నమః
ఓం పద్మలోచనాయై నమః
ఓం విద్యారూపాయై నమః
ఓం విశాలాక్ష్యై నమః
ఓం బ్రహ్మజాయాయై నమః
ఓం మహా ఫలాయై నమః
ఓం త్రయీమూర్త్యై నమః
ఓం త్రికాలజ్ఞాయై నమః
ఓం త్రిగుణాయై నమః
ఓం శాస్త్రరూపిణ్యై నమః
ఓం శుంభాసురప్రమథిన్యై నమః
ఓం శుభదాయై నమః
ఓం సర్వాత్మికాయై నమః
ఓం రక్త బీజ నిహంత్ర్యై నమః
ఓం చాముండాయై నమః
ఓం అంబికాయై నమః
ఓం ముండకాది ప్రహరణాయై నమః
ఓం ధూమ్రలోచన మర్దనాయై నమః
ఓం సర్వదేవస్తుతాయై నమః
ఓం సౌమ్యాయై నమః
ఓం సురాసుర నమస్కృతాయై నమః
ఓం కాళరాత్ర్యై నమః
ఓం కలాధారాయై నమః
ఓం రూపసౌభాగ్యదాయిన్యై నమః
ఓం వాగ్దేవ్యై నమః
ఓం వరారోహాయై నమః
ఓం వారాహ్యై నమః
ఓం వారిజాసనాయై నమః
ఓం చిత్రాంబరాయై నమః
ఓం చిత్రగంధాయై నమః



ఓం చిత్ర మాల్య విభూషితాయై నమః
ఓం కాంతాయై నమః
ఓం కామప్రదాయై నమః
ఓం వంద్యాయై నమః
ఓం విద్యాధర సుపూజితాయై నమః
ఓం శ్వేతాసనాయై నమః
ఓం నీలభుజాయై నమః
ఓం చతుర్వర్గ ఫలప్రదాయై నమః
ఓం చతురానన సామ్రాజ్యై నమః
ఓం రక్తమధ్యాయై నమః
ఓం నిరంజనాయై నమః
ఓం హంసాసనాయై నమః
ఓం నీలజంఘాయై నమః
ఓం బ్రహ్మ విష్ణు శివాత్మికాయై నమః
ఓం వీణా వ్యాఖ్యాక్ష సూత్రభృతే నమః
ఓం నీల సరస్వత్యై నమః
ఓం బ్రహ్మ విద్యా ప్రదాయిన్యై నమః
ఓం సరస్వత్యై నమః
అష్టోత్తర శతనామ పూజాం సమర్పయామి.

**ధూపమ్ :-**

శ్లో॥ **దశాంగం గుగ్గులోపేతం సుగంధంచ మనోహరం ।**
**ధూపం గృహాణ కళ్యాణి భక్తిం త్వయ్య చలాంకురు ॥**
శ్రీ మహా సరస్వతీ దేవ్యై నమః ధూపమాఘ్రాపయామి.

**దీపమ్ :-**

శ్లో॥ **ఘృతాక్తవర్తిత్రితయైర్దీపితం దీప మంబికే ।**
**గృహాణ చిత్స్వ రూపేత్వం కమలాసనవల్లభే ॥**
శ్రీ మహా సరస్వతీ దేవ్యై నమః సాక్షాత్ దీపం దర్శయామి ।
ధూపదీపానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

**నైవేద్యమ్ :-**

శ్లో॥ **సుపక్వ గుడ సంమిశ్రం శాలిపిష్టవినిర్మితం ।**
**నైవేద్యం గృహ్యతాం దేవి మయా భక్త్యా సమర్పితం ॥**

ఓం భూర్భువస్సువః । తత్సవితుర్వరేణ్యం । భర్గోదేవస్య ధీమహి । ధియోయోనః ప్రచోదయాత్ । సత్యంత్వర్తేనపరిషించామి । అమృతమస్తు । అమృతోపస్తరణమసి । శ్రీ మహా సరస్వతీ దేవ్యై నమః సుపక్వగుడ సంమిశ్ర పంచకుడ పమిత శాలితండుల చూర్ణం నివేదయామి.

ఓం ప్రాణాయస్వాహా । ఓం అపానాయస్వాహా । ఓం వ్యానాయస్వాహా । ఓం ఉదానాయ స్వాహా । ఓం సమానాయస్వాహా । మధ్యే మధ్యే పానీయం సమర్పయామి. అమృతాపిధానమసి । ఉత్తరాపోశనం సమర్పయామి ।హస్తౌ ప్రక్షాళయామి । పాదౌ ప్రక్షాళయామి । శుద్ధ ఆచమనీయం సమర్పయామి ।



**తాంబూలమ్ :-**

శ్లో॥ **తాంబూలంచాపి కర్పూరం పూగనాగ దళైర్యుతం ।**

**గృహాణ దేవ దేవేశి తత్వరూపి నమోస్తుతే ॥**

శ్రీ మహా సరస్వతీ దేవ్యై నమః తాంబూలం సమర్పయామి

తాంబూల చర్వణానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

**నీరాజనమ్ :-**

శ్లో॥ **నీరాజనం గృహాణత్వం జగదానందదాయినీ ।**

**జగత్తిమిర మార్తాండ మండలేతే నమోనమః ॥**

శ్రీ మహా సరస్వతీ దేవ్యై నమః నీరాజనం దర్శయామి.

నీరాజనానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

**మంత్రపుష్పమ్ :-**

**యాకుందేందు తుషార హార ధవళా యాశుభ్రవస్త్రావృతా ।**

**యావీణావర దండ మండితకరా యాశ్వేత పద్మాసనా ।**

**యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతి భిర్దేవైస్సదా పూజితా ।**

**సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా ॥**

శ్రీ మహా సరస్వతీ దేవ్యై నమః దివ్య సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి.

**ఆత్మప్రదక్షిణమ్ :-**

**పాహి పాహి జగద్వంద్యే నమస్తే భక్త వత్సలే ।**

**నమస్తుభ్యం నమస్తుభ్యం నమస్తుభ్యం నమోస్తుతే ॥**

శ్రీ మహా సరస్వతీ దేవ్యై నమః ఆత్మప్రదక్షిణ నమస్కారం సమర్పయామి

**పునః పూజాం కరిష్యే :**

ఛత్రమాచ్ఛాదయామి । చామరాభ్యాం వీజయామి । నృత్యం దర్శయామి । గీతం శ్రావయామి । ఆందోళికా మారోహయామి । అశ్వానారోహయామి । గజానారోహయామి । సమస్త రాజోపచార దేవోపచార భక్త్యుపచార శక్త్యుపచార పూజా స్సమర్పయామి.

యస్య స్మృత్యాచ నామోక్త్యా తపః పూజా క్రియాదిషు ।

న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వన్దే తమచ్యుతం ॥

మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరి ।

యత్పూజితం మయాదేవి పరిపూర్ణం తదస్తుతే ॥

అనయాధ్యానావాహనాది షోడశోపచార పూజయా శ్రీ మహాసరస్వతీ దేవతా సుప్రీణాతు ॥ ఏతత్ఫలం పరమేశ్వరార్పణమస్తు

ప్రసాదం శిరసా గృహ్ణామి



## 9. నందికేశ్వర పూజా

ఆచమ్య.... ఏవం ప్రీత్యర్థం, శ్రీమాన్.... గోత్రః....నామధేయః.... ధర్మపత్నీ సమేతోహం శ్రీమతః.... గోత్రస్య.... నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య మమకుటుంబస్య ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం , సకలైశ్వర్య ప్రాప్త్యర్థం, సకల దుఃఖ నివారణార్థం సకల సుఖ భోగ సిద్ధ్యర్థంచ, శ్రీ నందికేశ్వర దేవ ముద్దిశ్య శ్రీ నందికేశ్వర దేవ పూజాం కరిష్యే

అదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే.....కృత్వా తతః పీఠార్చనం కరిష్యే...... ప్రతిమాశోధనం కుర్యాత్ ।

తత్పురుషాయ విద్మహే । చక్రతుండాయ ధీమహి తన్నో నందిః ప్రచోదయాత్ ॥

శ్రీనందికేశ్వర మావాహయామి స్థాపయామి పూజయామి.

ప్రాణ ప్రతిష్ఠాపనం కుర్యాత్

**ధ్యానమ్ :-**

శ్లో॥ **కోటిసూర్య సమానాభం గౌరీశంకర వాహనం ।**
**ఉద్భూత కేళిలోలంతం ధ్యాయేహం నందికేశ్వరం ॥**
నందికేశ్వర దేవతాభ్యో నమః ధ్యాయామి ॥

**ఆవాహనమ్ :-**

శ్లో॥ **ఆవాహయామి భక్త్యాత్వాం శిబికాభిర్హయైర్గజైః ।**
**పూజార్థం మండపే నానామణిహాటక నిర్మితే ॥**
నందికేశ్వర దేవతాభ్యో నమః ఆవాహయామి ॥

**ఆసనమ్ :-**

శ్లో॥ **ఆసనం స్వర్ణ రత్నాఢ్యం మృదుతూల పరిచ్ఛదం ।**
**దదామి భక్త్యాస్థిత్వాస్మిన్ ఉపచారాన్ గృహాణభో ॥**
నందికేశ్వరాయ నమః నవరత్నఖచిత హేమ సింహాసనం సమర్పయామి ॥

**పాద్యమ్ :-**

శ్లో॥ **పాద్యం స్వీకురుమే దత్తం చరణాంబురుహద్వయే ।**
**యుక్తం సుగంధ పుష్పాబ్జ మణి హేమ నవాంకురైః ॥**
నందికేశ్వరాయనమః పాదయోః పాద్యం సమర్పయామి.



అర్ఘ్యమ్ :-

శ్లో॥ అర్ఘ్యం హస్తద్వయే దత్తం చందనోశీరవాసితం ।
యవదూర్వాంకుర ఫల పుష్పరత్నాన్వితం ముదా ॥

నందికేశ్వరాయనమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి.

ఆచమనీయమ్ :-

శ్లో॥ ఆచమ్యతాంతోయ మిదం వస్త్రపూతం సుగంధితం ।
ఆనీతం యమునా గంగా తీర్థేభ్యోతి ప్రయత్నతః ॥

నందికేశ్వరాయనమః ముఖే ఆచమనీయం సమర్పయామి.

పంచామృత స్నానమ్ :-

శ్లో॥ పయోదధిఘృతోపేతం మధు శర్కరయాయుతం ।
గృహాణ దేవ దేవేశ స్నానం పంచామృతాం చితం ॥

నందికేశ్వరాయనమః పంచామృత స్నానం సమర్పయామి.

శుద్ధోదకమ్ :-

శ్లో॥ స్నానార్థం జలమానీతం శీతముష్ణం యథారుచి ।
సుగంధితం సర్వనదీ తీర్థేభ్యః ప్రతి గృహ్యతాం ॥

నందికేశ్వరాయనమః శుద్ధోదక స్నానం సమర్పయామి.

స్నానానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

వస్త్రమ్ :-

శ్లో॥ వస్త్రయుగ్మం గృహాణేదం రత్న కింకిణీ కాయుతం ।
శ్వేతం పీతం తథా రక్తం నీలం చిత్రం యథారుచి ॥

నందికేశ్వరాయనమః వస్త్రయుగ్మం సమర్పయామి.

యజ్ఞోపవీతమ్ :-

శ్లో॥ యజ్ఞసూత్రం త్రివృత్సూత్రం రాజతం కాంచనం తవ ।
రత్న గ్రంథియుతం శుద్ధం మంత్రితం ప్రతిగృహ్యతాం ॥

నందికేశ్వరాయనమః యజ్ఞోపవీతం సమర్పయామి.

గంధమ్ :-

శ్లో॥ కస్తూరికా కర్దమ చందనాని కాశ్మీర సంయోజిత గంధసారైః ।
విలేపనం స్వీకురు దేవదేవ నందీశ గంగాధర భారవాహ ॥

నందికేశ్వరాయనమః గంధాన్ధారయామి.



అక్షతాన్ :-

శ్లో॥ అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ శాలి తండుల మిశ్రితాన్ ।
అక్షతోసి స్వభావేన స్వీకురుష్వ మహాప్రభో
నందికేశ్వరాయనమః అక్షతాన్ సమర్పయామి.

### అథాంగ పూజా

| | | |
|---|---|---|
| ఓం నందికేశ్వరాయ నమః | – | పాదౌ పూజయామి |
| ఓం తీక్ష్ణపాదాయ నమః | – | ఖురౌ పూజయామి |
| ఓం వేదపాదాయ నమః | – | జానునీ పూజయామి |
| ఓం విశిష్టాయ నమః | – | కటిం పూజయామి |
| ఓం వృషభాయ నమః | – | పుచ్ఛం పూజయామి |
| ఓం శివప్రియాయ నమః | – | నూపురం పూజయామి |
| ఓం నర్తనప్రియాయ నమః | – | స్కంధౌ పూజయామి |
| ఓం బ్రహ్మాండోదరాయ నమః | – | ఉదరం పూజయామి |
| ఓం తీక్ష్ణ శృంగాయ నమః | – | శృంగౌ పూజయామి |
| ఓం విశాలనేత్రాయ నమః | – | నేత్రే పూజయామి |
| ఓం ధర్మరూపాయ నమః | – | నాసికాం పూజయామి |
| ఓం తిలతండుల భక్షకాయ నమః | – | ముఖం పూజయామి |
| ఓం శాశ్వతాయ నమః | – | శిరః పూజయామి |
| ఓం ధర్మరక్షణ తత్పరాయ నమః | – | సర్వాణ్యంగాని పూజయామి |

### నందికేశ్వర అష్టోత్తర శతనామావళిః

ఓం నందికేశ్వరాయ నమః
ఓం బ్రహ్మరూపిణే నమః
ఓం శివధ్యాన పరాయణాయ నమః
ఓం తీక్ష్ణ శృంగాయ నమః
ఓం వేదపాదాయ నమః
ఓం విరూపాయ నమః
ఓం వృషభాయ నమః
ఓం తుంగశైలాయ నమః
ఓం దేవదేవాయ నమః
ఓం శివప్రియాయ నమః
ఓం విరాజ మానాయ నమః
ఓం నటనాయ నమః
ఓం అగ్నిరూపాయ నమః
ఓం నర్తనప్రియాయ నమః
ఓం సితచామర ధారిణే నమః
ఓం వేదాంగాయ నమః
ఓం కర్పూర ప్రియాయ నమః
ఓం కైలాసవాసినే నమః



ఓం దేవాయ నమః
ఓం స్థిర పాదాయ నమః
ఓం శృతి ప్రియాయ నమః
ఓం శ్వేతోపవీతినే నమః
ఓం నాట్యనందనాయ నమః
ఓం కింకిణీ ధరాయ నమః
ఓం మత్త శృంగిణే నమః
ఓం హాటకేశాయ నమః
ఓం హేమ భూషణాయ నమః
ఓం విష్ణు రూపిణే నమః
ఓం పృథ్వీ రూపిణే నమః
ఓం నిధీశాయ నమః
ఓం శివవాహనాయ నమః
ఓం గుడ ప్రియాయ నమః
ఓం చారుహాసాయ నమః
ఓం శృంగిణే నమః
ఓం నవతృణ ప్రియాయ నమః
ఓం వేదసారాయ నమః
ఓం మన్త్ర సారాయ నమః
ఓం ప్రత్యక్షాయ నమః
ఓం కరుణాకరాయ నమః
ఓం శీఘ్రాయ నమః
ఓం లలామ కలికాయ నమః
ఓం శివయోగినే నమః
ఓం జలాధిపాయ నమః
ఓం చారురూపాయ నమః
ఓం వృషేశాయ నమః
ఓం సోమసూర్యాగ్ని లోచనాయ నమః
ఓం సుందరాయ నమః
ఓం సోమ భూషాయ నమః

ఓం సువక్త్రాయ నమః
ఓం కలినాశనాయ నమః
ఓం సుప్రకాశాయ నమః
ఓం మహావీర్యాయ నమః
ఓం హింసాయ నమః
ఓం అగ్నిమయాయ నమః
ఓం ప్రభవే నమః
ఓం వరదాయ నమః
ఓం రుద్రరూపాయ నమః
ఓం మధురాయ నమః
ఓం కామిక ప్రియాయ నమః
ఓం విశిష్టాయ నమః
ఓం దివ్యరూపాయ నమః
ఓం ఉజ్జ్వలినే నమః
ఓం జ్వాలానేత్రాయ నమః
ఓం సంవర్తాయ నమః
ఓం కాలాయ నమః
ఓం కేశవాయ నమః
ఓం సర్వదేవమయాయ నమః
ఓం శ్వేతవర్ణాయ నమః
ఓం శివసేనాయ నమః
ఓం చిన్మయాయ నమః
ఓం శృంగపట్టాయ నమః
ఓం శ్వేతచామర భూషాయ నమః
ఓం దేవరాజాయ నమః
ఓం ప్రభానందినే నమః
ఓం పండితాయ నమః
ఓం పరమేశ్వరాయ నమః
ఓం నిరూపాయ నమః
ఓం నిరాకారాయ నమః



ఓం ఛిన్నదైత్యాయ నమః
ఓం నాససూత్రిణే నమః
ఓం అనన్తాయ నమః
ఓం తిల తండుల భక్షణాయ నమః
ఓం ద్వారనన్దినే నమః
ఓం సరసాయ నమః
ఓం విమలాయ నమః
ఓం పట్ట సూత్రాయ నమః
ఓం కాల కంఠాయ నమః
ఓం శైలాద్రినే నమః
ఓం శిలాదన సునందనాయ నమః
ఓం కారణాయ నమః
ఓం శృతి భక్తాయ నమః
ఓం వీరఘంటాధరాయ నమః
ఓం ధన్యాయ నమః
ఓం విష్ణునన్దినే నమః
ఓం శివజ్వాలా గ్రాహిణే నమః

ఓం భద్రాయ నమః
ఓం అనఘాయ నమః
ఓం వీరాయ నమః
ఓం ధ్రువాయ నమః
ఓం ధాత్రే నమః
ఓం శాశ్వతాయ నమః
ఓం ప్రదోష ప్రియరూపిణే నమః
ఓం వృషాయ నమః
ఓం కుండల ధృతే నమః
ఓం భీమాయ నమః
ఓం సితవర్ణ స్వరూపిణే నమః
ఓం సర్వాత్మనే నమః
ఓం సర్వ విఖ్యాతాయ నమః
ఓం శ్రీ నందికేశ్వరాయ నమః
నానా విధపరిమళ పత్రపుష్పాక్షతాన్ సమర్పయామి.

**ధూపమ్ :-**

**శ్లో॥ దశాంగం గుగ్గులోపేతం గంధాఢ్యం సుమనోహరమ్ ।**
**ధూపం స్వీకురు నందీశ, మహాపాప విమర్దన ॥**
నందికేశ్వరాయ నమః ధూపమాఘ్రాపయామి.

**దీపమ్ :-**

**శ్లో॥ సాజ్యమేకార్తి సంయుక్తం వహ్నినా, యోజితం ప్రియం ।**
**గృహాణ మంగళం దీపం త్రైలోక్య తిమిరాపహా ॥**
**భక్త్యా దీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే ।**
**త్రాహిమాం నరకాద్ఘోరా ద్దివ్యజ్యోతిర్నమోస్తుతే ॥**
నందికేశ్వరాయ నమః సాక్షాత్ దీపం దర్శయామి ।
ధూపదీపానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి.



నైవేద్యమ్ :-

శ్లో॥ శంభువాహ నమస్తుభ్యం సర్వలోకైక పూజిత ।

చణకాన్ ప్రతిగృహ్ణీష్వ సంస్కృతాన్ జీరకాదిభిః ॥

ఓం భూర్భువస్సువః । తత్సవితుర్వరేణ్యం । భర్గోదేవస్య ధీమహి । ధియోయోనః ప్రచోదయాత్ । సత్యంత్వర్తేనపరిషించామి । అమృతమస్తు । అమృతోపస్తరణమసి । శ్రీ మహా నందికేశ్వరాయ నమః జీరాది సంస్కృతాన్ పంచకూడ పమిత చణకాన్ నివేదయామి.

ఓం ప్రాణాయస్వాహా । ఓం అపానాయస్వాహా । ఓం వ్యానాయస్వాహా । ఓం ఉదానాయ స్వాహా । ఓం సమానాయస్వాహా । మధ్యే మధ్యే పానీయం సమర్పయామి. అమృతాపిధానమసి । ఉత్తరాపోశనం సమర్పయామి ।హస్తౌ ప్రక్షాళయామి । పాదౌ ప్రక్షాళయామి । శుద్ధ ఆచమనీయం సమర్పయామి ।

తాంబూలమ్ :-

శ్లో॥ పూగీఫలైస్స కర్పూరైః నాగవల్లీ దళైర్యుతం ।

ముక్తా చూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం ॥

నందికేశ్వరాయ నమః తాంబూలం సమర్పయామి

తాంబూల చర్వణానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

నీరాజనమ్ :-

శ్లో॥ ఘృతవర్తి సహస్రైశ్చ కర్పూర శకలైస్తథా ।

నీరాజనం మయాదత్తం గృహాణ వరదోభవ ॥

నందికేశ్వరాయ నమః నీరాజనం దర్శయామి.

నీరాజనానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

మంత్రపుష్పమ్ :-

తత్పురుషాయ విద్మహే చక్రతుండాయ ధీమహి । తన్నో నందిః ప్రచోదయాత్ ॥

నందికేశ్వరాయ నమః దివ్య సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి.



**ఆత్మప్రదక్షిణమ్ :-**

**యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ ।**

**తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదే పదే ॥**

**పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాప సంభవః ।**

**త్రాహిమాం కృపయాదేవ శరణాగత వత్సల ॥**

**అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ ।**

**తస్మాత్కారుణ్య భావేన రక్ష రక్ష నందీశ్వర॥**

నందికేశ్వరాయ నమః ఆత్మప్రదక్షిణ నమస్కారం సమర్పయామి

**పునః పూజా కరిష్యే :**

ఛత్రమాచ్ఛాదయామి । చామరాభ్యాం వీజయామి । నృత్యం దర్శయామి । గీతం శ్రావయామి । ఆందోళికా మారోహయామి । అశ్వానారోహయామి । గజానారోహయామి । సమస్త రాజోపచార దేవోపచార భక్త్యుపచార మంత్రోపచార తంత్రోపచార పూజా స్సమర్పయామి.

యస్య స్మృత్యాచ నామోక్త్యా తపః పూజా క్రియాదిషు ।

న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వన్దే తమచ్యుతం ॥

మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం నందీశ్వర ।

యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే ॥

అనయాధ్యానావాహనాది షోడశోపచార పూజయా నందికేశ్వర దేవ స్సుప్రీణాతు॥

ఏతత్ఫలం పరమేశ్వరార్పణమస్తు

ప్రసాదం శిరసా గృహ్ణామి.

అనేన మయాచరిత నవ దేవాత్మకేన శ్రీ నందికేశ్వర వ్రతేన శ్రీ నందికేశ్వరః సుప్రసన్నో వరదోభూత్వా మమాభీష్ట సిద్ధిం కరోతు ।

వ్రతం సువ్రతమస్తు । ఆచరిత వ్రత సంపూర్ణ సకల ఫలావాప్తిరస్తు ॥



## నందికేశ్వర వ్రత కథా

శ్లో॥ వాగీశాద్యాస్సుమనసః సర్వార్థానా ముపక్రమే।
యంనత్వా కృతకృత్యాస్స్యుః తన్నమామి గజాననమ్ ॥

బ్రహ్మాది దేవతలు సర్వకర్మారంభముననూ గణపతిని నమస్కరించి పూజించి సఫలీకృతులైనట్లుగా మేము కూడా ఈ కథారంభమున గణపతికి నమస్కరించుచున్నాము.

ఋషయ ఊచుః ॥

శ్లో॥ సూత సూత మహా ప్రాజ్ఞ సర్వజ్ఞ కరుణాకర।
త్వత్తశ్శృతా న్యశేషాని, పురాణాని మహాంతిచ ॥

శ్లో॥ శివ వ్రతాన్యనేకాని త్వదు క్తాని మహామతే।
చీర్ణానితాని సర్వాణి వ్రతాని ఫలవంతిచ ॥

శ్లో॥ తథాపి తృప్తి రస్మాకం, నజాతా శైవవల్లభ।
సంసారచక్రే త్వేతస్మిన్ వర్తమానా నరాభువి ॥
దారిద్ర్యాభిహతా స్సర్వే స్వకర్మ పరి పాకతః ॥

శ్లో॥ తేషామను గ్రహార్థాయ దారిద్ర్యస్యాపనుత్తయే।
వ్రతం మహాఫలం బ్రూహిలోకోపకృతి హేతవే ॥

కరుణాత్మకుడవు, సర్వజ్ఞుడవైన ఓ సూతమహర్షీ! మీవలన అనేక పురాణేతిహాసములు వినియుంటిమి. అయిననూ మాకు తృప్తి కలుగుట లేదు. మానవులు సంసార బంధమున పడినవారై దుష్కర్మల నాచరించి కష్ట, దారిద్ర్య పీడితులగుచున్నారు. వారి దారిద్ర్య విచ్ఛేదనకు మహా ఫల ప్రదమైన ఒక గొప్ప వ్రతమును చెప్పవలసినదిగా ప్రార్థించుచున్నాము.

సూత ఉవాచ :-

శ్లో॥ మునయ స్సర్వ ధర్మజ్ఞాః లోకోపకృతి శీలినః।
అతో వదామి యుష్మాకం వ్రతం దారిద్ర్య భంజనమ్ ॥

సకల ధర్మములు తెలిసిన ఓ మునులారా! లోకోపకారమునకు మీరడిగిన దారిద్ర్య నివారకమైన వ్రతమును చెప్పుచున్నాను, వినుడు.

శ్లో॥ పురాతు మేరు శిఖరే నానారత్నోప సేవితే।
సత్యలోకో విభాత్యత్ర సర్వవైభవసంయుతః ॥

శ్లో॥ తస్థా చతుర్ముఖ స్తత్ర సృష్టికార్య విధానవిత్।
బ్రహ్మాణం స్వపతిం దృష్ట్వా స్వరాపృచ్ఛ దిదంవచః ॥

పూర్వము మేరు పర్వత శిఖరముల మీద అనేక రత్నమయము, అనేకవన సంయుతమగు



సత్యలోకము సకలభోగములతో అలరారుచున్నది. అక్కడ చతుర్ముఖ బ్రహ్మ ప్రజాసృష్టి చేయుచుండగా, సరస్వతీ దేవి భర్తయగు బ్రహ్మతో ఇటుల పలికెను.

**సరస్వత్యువాచ:-**

**శ్లో॥ మర్త్యలోకే జనాస్సర్వే పాపకర్మ పరాయణాః ।**
**తత్కర్మపరిపాకేన దరిద్రాః ప్రభవంతి హి ॥**

**శ్లో॥ అతో దారిద్ర్య నాశాయ సర్వసంపత్తి హేతవే ।**
**వ్రతమైశ్వర్యదం బ్రూహి యత్కృత్వా శ్రియ మాప్నుయుః ॥**

నాథా ! నీవు సకల వేద పూజితుడవు. పాపకర్మలు చేయుచు మానవులు దరిద్రులుగా పుట్టుచున్నారు. అట్టి జనుల దారిద్ర్య పరిహారమునకు, ఐశ్వర్యప్రాప్తికి సాధనమగు ఒక గొప్ప వ్రతమును చెప్పుమని సరస్వతీదేవి బ్రహ్మను ప్రార్థించెను.

**చతుర్ముఖ ఉవాచ :-**

**శ్లో॥ శృణుదేవి ప్రవక్ష్యామి సర్వైశ్వర్య ప్రదం వరమ్ ।**
**దారిద్ర్య భంజనం చాపి వదామి వ్రతముత్తమమ్ ॥**

**శ్లో॥ నందీశ్వర మితి ఖ్యాతం వ్రతం సర్వ సుఖాస్పదమ్ ।**
**దారిద్ర్య హననే దక్షం సర్వైశ్వర్య వివర్ధనమ్ ॥**

ఓ సరస్వతీ ! సర్వైశ్వర్యప్రదము, దారిద్ర్య భంజకమగు నందీశ్వర వ్రతము సకలసుఖములనిచ్చును.

**శ్లో॥ దేవదారు వనే కశ్చిద్బ్రాహ్మణ శ్శివ వల్లభః ।**
**స్వకర్మ నిరత శ్శ్రీమాన్ ఉపదేవ ఇతి స్మృతః ॥**

**శ్లో॥ తస్య భార్యా వరారోహా పతిభక్తి పరాయణా ।**
**నామ్నా సాచారు శీలాఖ్యా సర్వసద్గుణ శాలినీ ॥**

దేవదారు వనమందు గొప్ప శివభక్తుడు, సదాచార సంపన్నుడు, స్వధర్మానుష్ఠానమును గొప్పగా పాటించు ఉపదేవుడను బ్రాహ్మణ శ్రేష్ఠుడు కలడు. అతనికి మిక్కిలి సౌందర్యవతి, మహాపతివ్రత, సకల సద్గుణములు కలిగిన చారుశీల యను భార్య కలదు.

**శ్లో॥ తథాపి నితరాం సాపి దారిద్ర్య పరి పీడితా ।**
**నిత్యం క్షుత్క్షామ దేహాసా పుత్రాది భరణాక్షమా ॥**
**ఏకదా సా పతిం దృష్ట్వా ప్రణమ్య వినయాన్వితా ॥**

అట్టి సుగుణములు పెక్కు ఉన్ననూ, ఆమె దారిద్ర్య బాధచే ఆకలి దప్పులచే పిల్లలకునూ తనకునూ కడుపునిండా అన్నము చాలక కృశించినదై ఒకసారి భర్తతో ఇటులపలికెను.



శ్లో॥ మునినాథ ! సర్వధర్మజ్ఞ శివపూజా విధానవిత్ ।
కష్టాత్కష్ట తరం దేవ దారిద్ర్యం పాపహేతుకమ్ ॥

శ్లో॥ దారిద్ర్యాభిహతా హం వై పుత్రాది భరణాఽక్షమా ।
ఉపాయం యది జానాసి వద సంపత్తిదాయకమ్ ॥

ఓనాథా ! నీవు సర్వధర్మముల నెరింగిన వాడవు. విశేషించి శివపూజా ధురంధరుడవు. పాపము వలన వచ్చెడి ఈ దారిద్ర్యము భరించుట చాలా కష్టముగానున్నది. ఈ దారిద్ర్యము వలన పిల్లలకైనా తగినంత ఆహారమీయజాలకుంటిని. ఈ దారిద్ర్య బాధతొలగుటకు తగిన ఉపాయము సెలవీయవలిసినదని కోరెను.

శ్లో॥ శివ వ్రతాని సర్వాణి త్వయా చీర్ణాని భామిని ।
తథాపినందినో భద్రే వ్రతం త్యక్తం మహాఫలమ్ ॥
యస్యానుష్ఠాన మాత్రేణ హ్యైశ్వర్యమతులం మహత్ ॥
అతో నందీశ్వర స్యేదం వ్రతంకురు సుశోభనమ్ ॥

దేవీ ! సకల లోకములకునూ శుభప్రదమైన ఒక వ్రతమును చెప్పెదను. నీవు శివప్రీతికరములైన అనేక వ్రతములాచరించిననూ, నందీశ్వర వ్రతము నాచరింపలేదు. నందీశ్వర వ్రతము అనంతైశ్వర్య కారకము. కావున నీవు శుభప్రదమైన నందీశ్వర వ్రతమాచరింపుము.

శ్లో॥ ఏవముక్త్వా ద్విజవరో నవదైవాత్మకం వ్రతమ్ ।
ఉపదిశ్య విధానజ్ఞః సర్వంవ్రత మకారయత్ ॥

అని బ్రాహ్మణోత్తముడు, సకలవ్రత విధానములు చక్కగా తెలిసినవాడు కావున తొమ్మిది మంది దేవతలు గల్గిన నందీశ్వర వ్రతమును ఆమెతో విధివిధానముగా చేయించెను.

## వ్రత విధానము

శ్లో॥ వ్రతే తస్మిన్నంది కేశేతు అదౌపూజ్యోగణా ధిపః ।
కాలభైరవ దేవస్య పూజా కార్యా తతః పరమ్ ॥
తతస్తు శివ స్సంపూజ్యః సూర్యచంద్రౌతతః పరమ్ ।
గిరిజా పూజనం పశ్చా దాంజనేయస్య పూజనమ్ ॥
తతస్సరస్వతీ పూజా కార్యా భక్తి సమన్వితా ।
తతో నందీశదేవస్య పూజనం నియమేన హి ॥
కార్యం ఫలప్రదం సర్వ దారిద్ర్యపరిమోచనమ్ ।
కుడ పానాం పంచకేన మితం నైవేద్య మర్పయత్ ॥

ఈ నందికేశ్వర వ్రతమునందు ముందు గణపతిని పూజించవలెను. తదుపరి వరుసగా


2.కాలభైరవుడు, 3.శంకరుడు, 4.సూర్యనారాయణుడు, 5.చంద్రుడు, 6.పార్వతీదేవి, 7.ఆంజనేయుడు, 8.సరస్వతీదేవి, చివరగా 9.నందీశ్వరుని పూజించవలెను. అట్టి నవదేవతల పూజవలన దారిద్ర్యము పరిహారము కాగలదు. ఒక్కొక్కదేవతకు ఐదు మానికల పదార్థము అనగా 10శేర్లు నివేదన చేయవలసి యుండును. కాని లోకమున చాతుర్మాస్య వ్రతమును నాల్గునెలలకు బదులుగా 2నెలలు చేయువిధమున 5 మానికలకు బదులుగా 5శేర్లు చేయుచున్నారు. అవకాశము, శక్తి యున్నచో 10 శేర్లు చేయుట శ్రేష్ఠము.

శ్లో॥ మోదకాని గణేశస్య నైవేద్యం పరి కల్పయేత్ ।
కాలభైరవ దేవస్య మాష చక్రాణి చార్పయేత్ ॥
శివస్యగుడ సమ్మిశ్రం తిలపిష్టం నివేదయేత్ ।
క్షీరాన్నం సూర్యదేవస్య చంద్రస్య వటకానపి ॥
పార్వత్యాః కృసరాన్నంచ మితం కుడపపంచకే ।
ఆంజనేయస్య దేవస్య అపూపానర్పయేచ్ఛుభే ॥
సరస్వత్యా గుడోపేతం శాలిపిష్టం నివేదయేత్ ।
తతో నందీశ దేవస్య చణకానర్పయేన్ముదా ॥

మొదటగా గణపతికి ఉండ్రాళ్ళు 10 శేర్లు రవ్వతో చేసి నివేదించవలెను. కాలభైరవునికి గారెలు, శివునకు నువ్వులు, బెల్లము కలిపిన చిమ్మిరి, సూర్యభగవానునకు పాయసము, చంద్రునకు అట్లు, పార్వతీదేవికి పులగము, ఆంజనేయునకు అప్పాలు, సరస్వతీదేవికి ప్రీతిగా చలిమిడి, చివరకు నందీశ్వరునకు ప్రీతిగా శనగలు నానపెట్టి వేయించినవి నివేదన చేయవలెను.

శ్లో॥ నివేదిత పదార్థానాం నగృహీతి క్రమం చరేత్ ।
సర్వేషాం పూజ్య దేవానాం మితం కుడప పంచకమ్ ॥
గృంహాంగణే ప్రదేయం స్యాద్బ్రాహ్మణేభ్యో భవేదితి ।
యదిహ్యాతి క్రమేత్సర్వం వ్రతభంగో భవేదితి ॥
ఏవంయా కురుతేనారీ సర్వాన్ కామానవాప్నుయాత్ ।

నివేదన చేసిన ఆయా ప్రసాదములు ఇంటి ప్రహరీ దాటి పోగూడదు. ప్రతిదేవునకు 10శేర్ల పదార్థము నివేదన చేయవలెను. ఇంటి ఆవరణలోనే బ్రాహ్మణులకు మాత్రమే పెట్టవలెను. పై నియమములను అతిక్రమించినచో వ్రత భంగము అగును. తొమ్మిదింటిలో ఏ ఒక్కటి అతిక్రమించినా, వ్రతభంగము అయినట్లేనని తెలుసుకొనవలెను. ఈ రీతిగా ఏ స్త్రీ శ్రద్ధాభక్తులతో ఈ వ్రతము ఆచరించునో ఆమెకు సకలైశ్వర్యములు, ఐదవతనము వృద్ధినొందును.



ఈ వ్రతము స్త్రీల గురించి చెప్పిననూ, ఆది, అంత్యములయందు, అనగా వ్రతారంభమున, ఉద్యాపనయందు దంపతులు కూర్చొని పూజ చేయుట శ్రేష్ఠము.

## ఉద్యాపన విధి

శ్లో॥ ఉద్యాపనం ప్రవక్ష్యామి వ్రత సంపూర్తి హేతవే ।
అదౌ మధ్యే తథాచాంతే కుర్యాదుద్యాపనం ముదా ॥

ఇక ఈ వ్రతమునకు ఉద్యాపన విధి చెప్పుచున్నాను. ఆరంభమందు గానీ, మధ్యలో గానీ, చివరకు గానీ ఉద్యాపన చేయవచ్చును. ఉద్యాపన చేసిన గానీ వ్రతము సంపూర్ణము కాదు.

శ్లో॥ గృహస్యేశాన భాగేతు మండపం పరికల్పయేత్ ।
రంభా స్తంభాదినా సమ్యగలం కృత్య సుతోరణైః ॥
తన్మధ్యే సర్వతోభద్ర మండలం పరికల్పయేత్ ॥
మంటపేతు నవం వస్త్రయుగ్మంతు పరికల్పయేత్ ।
తన్మధ్యే పంచకుడపాన్ ప్రసార్యశాలితండులాన్ ॥
రజతేనైవ పీఠంస్యాల్లింగం స్వర్ణమయం శుభమ్ ।
రాజితం నందినోరూపం శృంగే స్వర్ణమయే శుభే ॥
ఆవాహ్య నవదేవాంస్తు కలశేషు పృథక్పృథక్ ।
నవగ్రహాన్దిక్పతీంశ్చ ఆవాహ్య పూజయేత్క్రమాత్ ॥

గృహాము నందు ఈశాన్య భాగములో మంటపమును ఏర్పరచి ఆ మంటపమునకు అరటి స్తంభములు, మామిడి మండలు, పూలమాలతో అలంకరించి, సర్వతో భద్ర మండలమును పంచరంగులతో ఏర్పరిచి రెండు నూతన వస్త్రములను ఆ మంటపంమీద ఉంచి దానిపై 10 శేర్ల బియ్యము పోసి 9 కలశములను ఉంచి గణపతి మొదలుగా తొమ్మిది దేవతలను ఆయా కలశములయందు ఆవాహన చేసి, నవగ్రహములను, దిక్పాలకులను లోకపాలకులను ఆవాహన చేసి చివరగా ఒక వెండి పీఠముపై బిగించియున్న బంగారపు శివలింగము, వెండినంది,(నందికొమ్ములు మాత్రం బంగారముతో ఉండునటుల) మంటపమధ్యనందుంచి ఆవాహన, ప్రాణ ప్రతిష్ఠ జరుపవలెను.



శ్లో॥ శివరాత్ర్యాం ప్రదోషేతు శంకరం నందికేశ్వరమ్ ।
ప్రతిష్ఠాప్య విధానేన పూజయేద్భక్తితశ్శుభే ॥
కృత్వా ప్రాణప్రతిష్ఠాంచ పూజయే దుపచారకైః ।
రాత్రౌ జగరణం కుర్యా ద్యథావిత్తానుసారతః ।
తౌర్యత్రికం బ్రాహ్మణైశ్చ స్వస్తివాచనికం చరేత్ ॥

ఈ ఉద్యాపన మహాశివరాత్రి నాడు గాని, ప్రతినెల వచ్చు మాసశివరాత్రులందు గానీ సూర్యాస్తమయము అయిన పిమ్మట మంటపారాధన జరిపి సద్యోజాత, పురుషసూక్త, శ్రీసూక్త విధానముగా ఆయా దేవతల అష్టోత్తర శతనామములతో పూజసలిపి తెల్లవార్లు జాగరణ చేయుచూ, శక్తి కల్గినచో మంగళవాయిద్యములతోనూ, వేదపండితుల స్వస్తివచనములతోనూ, నామ సంకీర్తనాదులతోగానీ జాగరణ చేయవచ్చును.

శ్లో॥ తతః ప్రాతస్సముత్థాయ నిత్య కృత్యం సమాప్యచ ।
బ్రహ్మచారిణ మాహూయ పూజయిత్వా యథావిధి ॥
హరిద్రా లేపితం వస్త్రయుగ్మం దత్వాఽతి భక్తితః ।
కుడ పానాం పంచేకేనమితంముద్గంచ నిస్తుషం ॥
దద్యాల్లింగంచ నందీశం దక్షిణా సహితం ముదా ।
తతో మంటప దానంచ ఆచార్యాయ ప్రదాపయేత్ ॥
ఏవం కృతో ద్యాపనేన వ్రతపూర్తి ర్భవిష్యతి ।
ఉద్యాపన మకృత్వాతు సర్వంతన్నిష్ఫలం భవేత్ ॥

తెల్లవారిన పిదప స్నాన సంధ్యాదులు ముగించుకొని ఒక బ్రహ్మచారిని పిలిచి పూజచేసి పసుపులో ముంచి ఆరవేసిన లుంగీలు రెండు అతనికి సమర్పించి 10శేర్లు పొట్టులేని పెసరపప్పు ఒక ఇత్తడిపాత్రలో పోసి వాసెన గట్టి నందీశ్వర శివలింగములు గల వెండి పీఠమును ఆపాత్రపై ఉంచి దానమీయవలెను. లోకములో తడిపిన పెసరపప్పు ఇచ్చుట ఆచారముగా ఉన్నది. కానీ కల్పములో తడిపి ఇవ్వవలెనని లేదు. పొడి పెసరపప్పు ఈయవలెను.

పిమ్మట నవకలశములతో నున్న మంటపమును బ్రహ్మగార్కి దానమిచ్చి శక్తి కొద్ది బ్రాహ్మణ సమారాధన చేయవలెను. ఇట్టి ఉద్యాపనతోనే వ్రతము సంపూర్ణము కాగలదు. ఉద్యాపన రహితమైన వ్రతాచరణ నిరర్థకమగును. ఇలా విధి విధానముగా ఆచరించిన వ్రతము సంపూర్ణమయి, దారిద్ర్య పరిహారము, సౌభాగ్య సౌమంగల్యాభి వృద్ధిని కల్గించును.



శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా చారుశీలా నందీశ వ్రత మాచరేత్ ।
ప్రతస్యాస్య ప్రభావేన ధనధాన్యాది సంపదః ॥
సంబభూవు రిదం నూనం సత్యం చైవమయో దితమ్ ।
ఏతద్వ్రత ప్రభావేన పునర్జన్మాంతరేపిచ ।
అవంతీ నగరే రమ్యే సర్వైశ్వర్య సమన్వితే ॥
జాయాపతీ సుపుణ్యేచ బ్రహ్మవంశే బభూవతుః

ఈ ప్రకారముగా చారుశీల శ్రద్ధగా నందీశ్వర వ్రతమునూ, ఉద్యాపన విధిని విని, యథా శాస్త్రీయముగా ఆచరించి ధనధాన్య సంపదలు గలదాయను. మరియూ ఈ వ్రత ప్రభావము వలన మరుసటి జన్మలో ఆదంపతులు శ్రేష్ఠమైన బ్రాహ్మణజన్మ నొంది అవంతీ నగరంలో సర్వైశ్వర్యములు కల్గిన వారాయెను.

శ్లో॥ సాచ స్వర్ణమయీాందోలాం ఆరుహ్య ముదితాననా ।
అవసత్సా చిరంకాలం సుఖేన ప్రముమోదహ ॥

ఆచారుశీల బంగారపు ఊయల చేయించుకొని అందు అధిష్ఠించి తీవీగా సంతోషముగా కాలము గడుపుచుండెను.

శ్లో॥ ఏకదా తద్గృహానేత్య బ్రాహ్మణీ కాచిదంగనా ।
ఏవ మప్రార్థయచ్చాగ్నిం పచనార్థం నితంబినీ ॥
దృష్ట్వా సావిప్రవనితా మిదమాహ విశారదా ।
చుల్లీ స్థేద్యఘటే తన్వి పచ్యంతే తండులాని హి ॥
యదాతు పచనం భూయాత్తావ దత్రైవ సంస్థితా ।
ఉత్తార్య దృష్ట్వా గచ్ఛాగ్నిం గృహీత్వా వరవర్ణిని ॥

ఇట్లుండ ఒకనాడు ఆ నగరములో ఒక బ్రాహ్మణ వనిత ఆచారుశీల ఇంటికి వచ్చి వంట చేసుకొనుటకు కొంచెము నిప్పును ఇమ్మని అడిగెను. దానికామె మా ఇంటిలో పొయ్యిమీద అన్నము ఉడుకుచున్నది. నీవు లోనికేగి అన్నము ఉడికిన పిమ్మట అది దింపి ప్రక్కన ఉంచి పొయ్యిలోని నిప్పును తీసుకుపొమ్మని చెప్పెను.

శ్లో॥ పునశ్చాన్యాపి వనితా తద్గృహం ప్రాప్య వీక్ష్య తాం ।
తక్రం కించి ద్దేహి భద్రే హ్యయా చయ దంతంద్రితా ॥

మరొకసారి ఇంకొక బ్రాహ్మణ స్త్రీ చారుశీల ఇంటికి వచ్చి అమ్మా! కొంచెం మజ్జిగ ఇప్పించుము అని అడిగెను.



శ్లో॥ హేతన్వి! మద్గృహస్థం యద్దధి తక్రం విధాయచ ।
నవనీతాదికం సర్వం అన్య పాత్రే నిధాయచ ॥
కించిత్తక్రం గృహీత్వాశు గచ్ఛ శీఘ్రం గృహోద్గృహిః ॥

ఆమాట విన్న చారుశీల ఓ అమ్మాయి! మాఇంటిలో ఉన్న పెరుగంతా బాగా చిలికి ఆవెన్నను ఒక పాత్రయందుంచి నీవు కొంచెం మజ్జిగ తీసుకొని శీఘ్రముగా వెళ్ళుమనెను.

శ్లో॥ ఏవం గృహాఽఽగతానాం సర్వాసాం చైవ యోషితామ్ ।
యత్కించి త్కార్య ముక్త్వాసా కారయంతీ ముదావసత్ ॥
ఏతస్యా శ్శ్రీమదాంధాయాః లోకేషు విదితం హ్యభూత్ ॥

ఈ విధముగా ఆమెను ఎవరు ఏ సహాయము కోసము ఇంటికి వచ్చి అడిగినా వార్కి ఏదో ఒక పని చెప్పి చేయించి సహాయ పడుచూ ఆనందముతో కాలము గడుపుచుండెను. ఇటుల ఈమెకు ధనమదాంధకారము గల్గెనని లోకములో అందరూ అనుకొనెడివారు.

శ్లో॥ ఏవం స్థితే చైకదాతు నారదో దివ్యదర్శనః ।
స్వర్గాది పుణ్యలోకాని సంపశ్యన్భువ మాగతః ॥
క్రమా దవంతీం సంప్రాప్య బ్రాహ్మణీచరితం తదా ।
శృణ్వంస్తద్గృహమాగత్య దృష్ట్వా తచ్చరితం తదా ॥
అతీవాశ్చర్య జలధౌ నిమగ్నస్సమునిర్మహాన్ ।

ఇట్లుండ ఒకనాడు త్రిలోక సంచారి, దివ్యజ్ఞానము కల్గిన నారదమహర్షి స్వర్గాది లోక సంచారము గావించి భూలోకమునకు వచ్చి క్రమముగా అవంతీపురానికి చేరెను. అచ్చట ఈ బ్రాహ్మణ స్త్రీ గురించి అందరూ చెప్పుకొనుట విని ఆసక్తితో తాను చారుశీల ఇంటికి వెళ్ళి ఆమె ఐశ్వర్యమును, రాజసమును చూసి విస్మయమంది ఆమెచేచేయబడిన నందీశ్వర వ్రతప్రభావము ఇటుల శోభించుచున్నదని సంతసించుచూ ఈమెకు ధనగర్వము వలన మదాంధకారము కల్గినది. దీనిట నివారింపచేయుట ఎట్లని యోచించుచూ,

శ్లో॥ కైలాస భవనం గత్వా బ్రాహ్మణీ చరితం మహత్ ।
పార్వత్యై కథయా మాస తదనుజ్ఞామవాప్యచ ॥
సత్యలోకంగత శ్రీ మాన్ నారదో మునిపుంగవః ।
నారదేనైవ యత్ప్రోక్తం తచ్ఛ్రుత్వా సాపి పార్వతీ ॥
విచార్య విప్రవనితా చరితం ద్రష్టు మేవసా ।
మనఃకృత్వాచ భూలోకమగమచ్ఛివ వల్లభా ॥



వెంటనే కైలాసముకేగి పార్వతీదేవికి నమస్కరించి అవంతికాపురిలోని బ్రాహ్మణస్త్రీ వైభవమును, ఐశ్వర్యమును, రాజసమును గూర్చి చెప్పి, తాను బ్రహ్మలోకమునకు వెళ్ళెను.

చారుశీల వృత్తాంతమును విన్న పార్వతీదేవి ఆమె భోగభాగ్యములను చూచుటకు ఉత్సాహముతో అవంతికాపురి చేరెను.

శ్లో॥ ఆగత్య వృద్ధ సద్విప్ర భార్యారూపం విధృత్యసా ।
విచారార్థం విప్రభార్యా గృహమేత్య తు పార్వతీ ॥
దృష్ట్వా స్వర్ణ మయీండోలా మాస్థితా మపరాం శ్రియం ।
అంగణే సంస్థితా తత్ర శివపత్నీ హిమాద్రిజా ॥

వృద్ధబ్రాహ్మణ స్త్రీ వేషము ధరించిన పార్వతి, ఈమెకు ఇంత విపులమైన ఐశ్వర్యము కల్గుటకు హేతువు ఏమయి ఉండునని ఆలోచించుచూ చారుశీల ఇంటికి వచ్చి, బంగారపు ఊయలలో అపర శ్రీలక్ష్మీ వలె భోగభాగ్యములతో తులతూగుచున్న చారుశీలను చూచుచూ నిలవగా

శ్లో॥ తదా తద్బ్రాహ్మణీ తన్వీ దృష్ట్వా వృద్ధ పతివ్రతాం ।
ఇదమాహ మహాభాగే వృద్ధాంబేత్వం శుచివ్రతా ॥
ఛుల్లీస్థేంధన జాలాని జ్వలంతి భువి వ్యర్థతః ।
తానీంధనాని త్వంభద్రే ఛుల్యాం ప్రజ్వలయాధునా ॥
అతస్త్వంతు యథా మార్గం గచ్ఛ గచ్ఛత్వరాద్భుహాత్ ॥

అంతలో ఆ చారుశీల ఆవృద్ధ పతివ్రతా రూపమున ఉన్న పార్వతీదేవిని చూచి ఓ వృద్ధ బ్రాహ్మణీ ! పొయ్యిలోని కట్టెల మంట నేల మీదకు వచ్చుచున్నది. నీవు ఆకట్టెలు కొంచెం పొయ్యిలోనికి నెట్టి త్వరగా ఇటనుండి ఇచ్చ వచ్చిన చోటుకు పొమ్మనెను.

శ్లో॥ తచ్ఛ్రుత్వా పార్వతీదేవి తత్సర్వంవి నివర్త్యచ ।
గృహం గత్వా రుషావిష్టా శిర ఆబధ్యవాససా ॥
అంధకార గృహం ప్రాప్య శయ్యాయాం సుస్థితాహ్యభూత్ ॥

చారుశీల మాటలు విన్న పార్వతీదేవి ఆమె చెప్పినట్లు పొయ్యిలోని కట్టెలు సరిచేసి శీఘ్రముగా కైలాసమునకు చేరితనకు గూడా పని చెప్పిన ఆ మదాంధకారముతో ఐశ్వర్యముతో తులతూగుచున్న చారుశీలయందు కోపముతో శిరస్సునకు గుడ్డచుట్టి కోపగృహమును ప్రవేశించి కదలక పడుకుండి పోయెను.



శ్లో॥ తదాతు శంకరో దేవః నిర్వర్త్య తప ఉత్తమమ్ ।
ప్రాప్యస్వభవనం తత్ర అదృష్ట్వా గిరిజాం తదా ॥
విచార్య సర్వంతత్కృత్యం గిరిజాం ప్రత్యపద్యత ॥

ఈశ్వరుడు తన తపము ముగించుకొని తన ఇంటికి వచ్చి చూడగా పార్వతీదేవి కనపడలేదు. విచారించగా దేవి కోపగృహమున ఉన్నదని తెలుసుకొని అక్కడకు వెళ్ళెను.

శ్లో॥ శయానాం తాం తత్ర దృష్ట్వా కింభద్రే కుపితాహ్యసి ।
కిమర్థమద్య స్వపిషి కారణం వద సత్వరమ్ ॥
తచ్ఛ్రుత్వా భర్తృగదితం పార్వతీ వ్యసనాన్వితా ।
భర్తారం ప్రాహ మన్నాథ! వదామి సుప్తి కారణమ్ ॥

ప్రియురాలా ! ఏకారణము వలన నీవు ఈ కోపగృహమునందు పరుంటివి. పగటినిద్ర శాస్త్రవిరుద్ధము గదా ? నీబాధ ఏమిటో తెల్పుమనిన శంకరునితో బాధాతప్త హృదయముతో పార్వతి ఈవిధముగా పలికెను.

శ్లో॥ భూలోకా వంతికాపుర్యాం బ్రాహ్మణీ కాచి దస్తిహి ।
ఐశ్వర్యమద సంయుక్తా రూపిణీ శ్రీరివాపరా ॥
సర్వాసాం బ్రాహ్మణీనాంచ అవమానం కరోతిసా ।
ఏతాస్యావచనం సర్వం నారదస్య ముఖాచ్ఛ్రుతం ॥
అహమప్యగమం ద్రష్టుం తత్ర భూలోకసుందరీమ్ ।
మాంద్రుష్ట్వా సాపి తన్వంగీ మామాప్యవ మతింకరోత్ ॥
తత్కారణేన దేవాద్య వసామ్యంధ గృహేత్వహమ్ ।
విద్యతే చేన్మయిదయా తస్యా ఐశ్వర్య మంజసా ॥
హరసర్వం సురేంద్రాది గీర్వాణ పరిపూజిత ।

భూలోకమందు అవంతికా పట్టణమున ఒక బ్రాహ్మణ స్త్రీ ఉన్నది. లక్ష్మి వలె సౌందర్యముతో ప్రకాశించుచూ ఐశ్వర్యమదగర్వితురాలై ఉన్నది. ఆమె బ్రాహ్మణ స్త్రీలను అవమానించుచున్నది. ఈవిషయములు నారదునివలన విని నేను ఉత్సుకతతో పోయి చూడగా ఆ స్త్రీ నన్ను గూడా అవమానపరచినది. ఆకారణము వలననే దేవా! ఈ చీకటిగదిలో ఉంటిని. నాయందు తమకు దయ ఉన్నచో ఆమె యొక్క సకల సంపదలను హరించుము. నీవు దేవదానవులతోను పూజింతుడవు గదా ! యని పార్వతి పల్కెను.



శ్లో॥ తచ్ఛ్రుత్వా పార్వతీ వాక్యం శివ స్సర్వదయాపరః ।
విఘ్నేశ్వరం సమాహూయ ఇద మహ మునీశ్వరాః ॥
అవంతీ పురవాసిన్యా వనితాయా గజానన ।
ఐశ్వర్య భంగం కురుభో! శీఘ్రంగత్వా హ్యవంతికామ్ ॥
గజాననో ప్యాహశివం, నకర్తుం శక్తిరస్తిమే ।
సామమాష్యసితా పాంగీ శాలి పిష్టాన్ కృతాన్ఛుభాన్ ॥
మోదకా స్పంచకుడు పమితా నర్పయతాదరాత్ ।
తస్మాన్నాహం తదైశ్వర్య లవం నాశితు మక్షమః ॥

అది విని దయా మయుడైన శంకరుడు గణపతిని పిలిచి గజాననా! అవంతికాపురిలోని బ్రాహ్మణ స్త్రీ యొక్క ఐశ్వర్యమును నశింపచేయమని చెప్పగా గజాననుడు నమస్కరించి తండ్రీ! ఆమె నాకు భక్తి పూర్వకముగా 10శేర్ల శ్రేష్ఠమైన ఉండ్రాళ్ళు నాకర్పించినది. ఆకారణముగా నేను ఆమె ఐశ్వర్యమును నశింపచేయలేను అనెను.

శ్లో॥ నందీశ్వరమథాహూయ వచనం చేద మబ్రవీత్ ।
తస్యా ఐశ్వర్యమతులం నుదత్వం నందికేశ్వర ॥
నాహం సమర్థశ్చలితుం శ్రియం కించిదపి ప్రభో ।
తద్దత్త పంచకుడపమిత చణక భక్షణాత్ ॥
తతశ్చ శంకరో దేవః కాలభైరవ మూచివాన్ ।
భో కాలభైరవాశుత్వం గత్వామచ్ఛాసనేనవై ॥
తస్యా ఐశ్వర్య మతులం నుద మద్భక్త వల్లభ ।
అసమర్థో స్మ్యహ్యం దేవ! తచ్ఛ్రియం పరిలుంపితుం ॥
తద్దత్త కుడప పంచ మాషపిష్టకృతానివై ।
మాషచక్రాణి రమ్యాణి ఘృతపక్వానిమే ప్రభో ॥

అపుడా శంకరుడు నందీశ్వరుని పిలచి నీవు అవంతీపురములోని ఆస్త్రీ యొక్క ఐశ్వర్యమును సమూలముగా నశింపచేయమనెను. అపుడా నందీశ్వరుడు, స్వామీ! ఆమె శ్రద్ధాభక్తులతో సమర్పించిన శనగలు స్వీకరించితిని. కావున నేను ఆమె ఐశ్వర్యమును నశింపచేయజాలననగా శంకరుడు కాలభైరవునికి గూడా పైవిధముగానే చెప్పెను. ఆయన స్వామీ! ఆమెచేత నేతిగారెలు స్వీకరించితిని కావున నేనామె ఐశ్వర్యమును పోగొట్టజాలను అనెను.



శ్లో॥ తతస్సూర్యం సమాహూయ ఇదంవచన మబ్రవీత్ ।
ఆదిత్య శ్శంకరం దేవ మువివానేవ మేవహి ॥
పంచప్రస్థమితే ధేనుక్షీరే చైలాదిసంయుతే ।
కుడపానాం పంచకేన మిత తండుల పూరితే ॥
పక్వం గుడాన్వితం శుద్ధం సిద్ధ పాయస భక్షణాత్ ।
తృప్తోస్మి దేవ చలితు మక్షమోస్మి దయామయ ॥

పిమ్మట శంకరుడు ప్రత్యక్షదేవతయగు సూర్యభగవానుని పిలచి ఆ బ్రాహ్మణ స్త్రీకి తగినశాస్తిగా ఆమె శ్రియమును పోగొట్టమనెను. అపుడా ఆదిత్యుడు స్వామీ, గోక్షీర ఏలాగుడ మిశ్రమమైన 10శేర్ల పాయస ప్రదానము చేసిన ఆమె ఐశ్వర్యమును నేను తొలగింపజాలననెను.

శ్లో॥ తతశ్చంద్రం సమాహూయ ఏవ మేవాభ్య భాషత ।
తస్యా ఐశ్వర్య మతులం నుద మచ్ఛాసనాదను ॥
నాహం సమర్థో దేవేశ సంపదం తద్వ్యపోహితుం ।
తద్దత్త పంచకుడప మిత తండుల పిష్టతః ॥
మాష పిష్టయుతం కృత్వా వటకా నర్పయన్మమ ॥

తదుపరి చంద్రుని పిలచి నీవు అవంతీ నగర బ్రాహ్మణ స్త్రీ యొక్క ఐశ్వర్యమును రూపుమాపమని యాదేశించగా చంద్రుడు, స్వామీ! ఆమె భక్తితో బియ్యపు పిండి, మినపపిండితో చేసిన అట్లు స్వీకరించిన కారణమున నేను ఆమెకు నష్టం కలిగించజాలను క్షమింపుడని శివుని వేడుకొనెను.

శ్లో॥ ఇద మాహాంజనే యాద్య భూలోకం గచ్ఛ మాచిరం ।
శ్రీమత్యా వనితాయాశ్చ ఐశ్వర్యం త్వరితంనుద ॥
నాహం సమర్థో దేవేశ తదైశ్వర్య ప్రచాలనే ।
మహ్యం తద్దత్తాజ్యపక్వాపూపాని హృదరేమమ ॥
పరిపూర్ణతయా భాంతి రుచ్యానిచ మహాంతిచ ।
తేనైవ కారణే నాహం అసమర్థోస్మి శంకర ॥

అప్పుడా పరమేశ్వరుడు ఆంజనేయుని పిలచి, హనుమా! నీవు త్వరితముగా భూలోకములో అవంతీపుర స్త్రీయొక్క సంపదలను నష్టపరచమని యాదేశించెను. అంతట నావాయుసుతుడు దేవా! ఐదు మానికల బియ్యపు పిండితో బెల్లము కలిపి నేతితో వండిన



అపూపములను ఆమె సమర్పించినది. అట్టి రుచికరములైన భక్ష్య భక్షణ కారణమున నేనామె ధనమునకు హాని కలిగించజాలనని వేడుకొనెను.

శ్లో॥ తతశ్చ శంకరో దేవ స్సమాహూయ సరస్వతీమ్ ।
స్త్రీ మర్మాణీతు నారీభి ర్విజ్ఞేయాని శుభాననే ॥
తత్పురీ విప్రవనితా గర్వభంగం సమాచర ।
సరస్వతీ శివంధృష్ట్వా నాహంగంతుం సముత్సహే ॥
గుడపక్తం విధాయాథ తస్మిన్నేలాది చూర్ణకమ్ ।
అసమర్థా మహాభాగ తస్మాన్నాహం వ్రజామివై ॥

తదుపరి శంకరుడు సరస్వతీ దేవిని పిలచి, ఓ సరస్వతీ స్త్రీల యొక్క మర్మములు లోతుపాతులు స్త్రీలకి బాగా తెలియును గదా! నీవవంతికా పురికిజని ఆ బ్రాహ్మణ స్త్రీని నిర్ధనురాలిగా చేయమనెనను. దానికామె ప్రభూ! నేనామెచే నివేదితమైన చలిమిడి ఏలాది సుగంధ ద్రవ్యములతో కూడినది స్వీకరించి తృప్తి నొందితిని కావున నేనామెకు కష్టము కలిగించ జాలనని వినయముగా చెప్పెను.

శ్లో॥ తచ్ఛృత్వా గిరిజాదేవీ శంకరం చంద్రశేఖరమ్ ।
ఇదమాహ మహాదేవ త్వమేవ నిపుణోహ్యసి ॥
ఐశ్వర్యచాలనే తస్యా స్త్వద్భృతే నాస్తికశ్చన ।
తస్మాత్వమేవ కుర్వాశు గత్వాతత్పుర మాదరాత్ ॥

ఈ సంభాషణలన్నియూ వింటూ ఉన్న పార్వతి పరమేశ్వరునితో ఇట్లనియె. ఓ నాథా! నీకంటే శక్తివంతులెవరూ లేరు. కావున సర్వ సమర్థులైన తామే స్వయముగా వెళ్ళి ఆ బ్రాహ్మణికి తగిన శాస్తి చేయగలరని కోరుచున్నాను.

శ్లో॥ తచ్ఛృత్వా పార్వతీవాక్య మిదమాహ మహేశ్వరః ।
శృణుదేవి ప్రవక్ష్యామి వృత్తాంతంతు మదీయకం ॥
ఇతః పూర్వం బ్రాహ్మణీ మాం సంపూజ్యాతి భక్తితా ।
సమర్పితం తయా సమ్యక్తిల పిష్టం గుడాన్వితమ్ ॥
తద్దత్త పంచకుడప తిలపిష్టస్య భక్షణాత్ ।
అసమర్థో స్మహం దేవి హ్యుదరం పరిపూరితమ్ ॥
తేనాహ మపి భోదేవి తద్దైశ్వర్యల వాల్లవమ్ ।
పరిమార్ష్టుం నశక్నోమి సత్యమేవ ప్రభాషితమ్ ॥



అది వినిన శంకరుడు దేవీ ! నా వృత్తాంతము గూడా వినుము ఇంతకు ముందు ఆ బ్రాహ్మణి శ్రద్ధా భక్తులతో బెల్లముతో కలిపిన నువ్వులపిండి సమర్పించినది. దానివలన నేను సంతుష్టాంతరంగుడనైతిని. కావున ఆమె ఉన్నతిని నేను పోగొట్టజాలను. ఇది సత్యము అని పలికెను.

శ్లో॥ తస్మాచ్చ కారణేనాద్య త్వమేవ గచ్ఛ తత్పురీమ్ ।
గత్వా వంతీ పురం శీఘ్రం తచ్ఛ్రియం పరిమార్జయ ॥
శివస్య వచనం శృత్వా పార్వతీముది తాననా ।
ఇదమాహ మహాభాగా శంకరం లోక శంకరమ్ ॥
కరుణాకర సర్వజ్ఞ విజ్ఞాపన మిదంశృణు ।
అవంతీ పుర సంస్థా యా వనితా సర్వసమ్మతా ॥
తత్పూజితా స్సర్వదేవా స్తద్భక్తి పరితోషితాః ।
వసంత్యా నంద హృదయా స్తస్మాద్యేకేపినక్షమాః ॥
అహమప్యస మర్థాస్మి తదైశ్వర్య ప్రచాలనే ।
తద్దత్త పంచకుడప కృసరాన్నస్య భక్షణాత్ ॥
తృప్తాహం నాథభో శంభో పదం చలితు మక్షమా ।
తస్మాదావాంతు గచ్ఛావ స్తాంద్రష్టుం తత్పురీం శుభాం ॥

కావున ఓ పార్వతీ ! నీవే స్వయముగా వెళ్ళి ఆ యవంతీపుర స్త్రీ యొక్క ఐశ్వర్యమును పరిహరింపుము అని శంకరుడనగా అది విని పార్వతి చిరునవ్వుతో శంకరునితో ఇట్లనియె. ఓ సర్వజ్ఞా! కరుణాకరా! శంభో! నావిజ్ఞాపన వినుడు అవంతికాపురస్థ బ్రాహ్మణస్త్రీ సర్వదేవతలను పూజించి వారనుగ్రహమును పొందియున్నది. నేను ఆమె ఐశ్వర్యమును పరిహరింపజాలను. ఏలననగా ఆమెచే నివేదించబడిన ఐదుమానికల పులగముచే నేను అత్యంత సంతృప్తిరాలినైతిని. కావున నేను ఆమెను కష్టపెట్టలేను. (విశేషము: – భగవంతుడు తన భక్తులను ఏ విధముగాను కష్టపెట్టలేరని ఇందు మనము గ్రహించవలసి యున్నది.) కావున ఓ శంకరా! ఇప్పుడు మనమిరువురము అవంతికకు ఏగి ఆస్త్రీని చూచి వచ్చెదము రమ్మని కోరగా,

శ్లో॥ దేవ్యుక్త వచనం శృత్వా శంకరోంగీ చకారహ ।
తతస్తౌ దంపతీ దేవౌ పార్వతీ పరమేశ్వరౌ ॥
భూలోకపుణ్య వనితా దర్శనాయ ముదాన్వితౌ ।



ప్రయాణం చక్రతు ర్నంది వాహారూఢౌ త్వరేణ హి ॥

ఆగత్య తద్గృహం శ్రీమ త్స్వర్ణ విద్రుమ వేదికమ్ ।

ముక్తాదామ వితానాఢ్య రత్నతోరణ భూషితమ్ ॥

తద్గృహం సంప్రవిశ్యాథ బ్రాహ్మణ్యా దర్శనం శుభం ।

దదతుస్సా సముత్థాయ దండ వత్ప్రణి పత్యవై ॥

పాద్యార్ఘ్య మధు పర్కాది ద్రవ్యైస్సంపుజ్య భక్తితః ।

స్తుతిం చకార సావిప్ర వనితా దేవ సమ్మతా ॥

తతశ్శివా శివశ్చో భావతి సంతోష మాపతు ః ।

పార్వతి కోరికను మన్నించి నందీశ్వరుని అధిరోహించి భూలోకములోని అవంతికా పట్టణమందున్న ఆపుణ్యవనితను చూచుటకు సంతోషముగా త్వరగా గౌరీశంకరులు బయలుదేరిరి. అచ్చటకు వచ్చి ముత్యాల తోరణములతోను, బంగారుస్తంభములతోను పగడాల దూలములతోను రత్నస్థకిత వేదికలతోనూ మహావైభవ సంపన్నమైన ఆగృహమందు ప్రవేశించి ఆబ్రాహ్మణ స్త్రీకి గౌరీ శంకరులు దివ్యదర్శనమిచ్చిరి. అంత ఆమె వెంటనే లేచి ప్రదక్షిణ నమస్కార పురస్సరముగా రత్నవేదికలయందు వారిని కూర్చుండబెట్టి పాద్య, అర్ఘ్య, మధుపర్కాదులతో పూజించి స్తోత్రము చేసెను. అంతనా గౌరీశంకరులు మిగుల సంతోషమందిరి.

శ్లో॥ తదా విప్రసతీం దృష్ట్వా దత్వాఽలభ్యవరాన్బహూన్ ।

శ్రీ నందికేశ దేవస్య వ్రతస్యాస్య ప్రభావతః ॥

అక్షయ్యా శ్రీర్భవత్యేవ పునఃకురు యతాత్మనా ।

ఇత్యుక్త్వా సంపదం చాశీర్దత్వాంతర్ధి మవాపతుః ॥

పునస్సా బ్రాహ్మణీ చక్రే వ్రతం విధి విధానతః ॥

వ్రతస్యాస్య ప్రభావేన ధనపుత్రాన్వితా భవత్ ॥

పిమ్మట ఆ బ్రాహ్మణ స్త్రీని చూచి అలభ్యమైన పెక్కు వరముల ననుగ్రహించి నీకు ఇట్టి ఐశ్వర్యము లభించుటకు కారణము నందికేశ్వర వ్రత ఫలమేనని తెలిపి మరల నీవు ఆ వ్రతమును అనుష్ఠింపుమని చెప్పి ఆశీర్వదించి గౌరీ శంకరులు అంతర్ధానమొందిరి. ఆ బ్రాహ్మణి గౌరీశంకరుల వాక్య ప్రకారము మరల ఈ జన్మయందు గూడా నందికేశ్వర వ్రతమాచరించి పుత్రపౌత్రాది సంపత్తినందెను.



## ఫలశ్రుతి

శ్లో॥ యఇమం పఠతే ధ్యాయం యేచశ్రోష్యన్తి మానవాః ।

ఆయురారోగ్యమైశ్వర్యమతులం సుఖమేధతే ॥

సత్యం సత్యం పునస్సత్యం శివస్యవచనం యథా ।

ఇతి శ్రీ స్కాందే మహా పురాణే కేదారఖండే నందిచరితే నందికేశ్వర వ్రతంనామ పంచదశోధ్యాయః

ఏభక్తులు ఈ అధ్యాయమును నవదేవతాత్మక నందికేశ్వర చరిత్రను పఠించిన, విన్నా వారు ఆయురారోగ్య, ఐశ్వర్య, సుఖములు తప్పక పొందగలరని ఈశ్వరుని వచనము. సత్యము అని చతుర్ముఖ బ్రహ్మ శ్రీసరస్వతీదేవికి తెల్పిన నందీశ్వర వ్రతకథను, విస్తరించి సూతమహర్షి శౌనకాది మహర్షులకు వివరించెను.

ఇది స్కాంద పురాణములోని కేదారఖండమందు గల నంది చరితములోని నందికేశ్వర వ్రతాత్మక పదునైదవ అధ్యాయము సమాప్తము.

ఏతత్ఫలం పరమేశ్వరార్పణమస్తు


మహాగణపతి


పరమశివుడు


పార్వతీదేవి


హనుమంతుడు


నందికేశ్వరుడు


సరస్వతీదేవి


కాలభైరవుడు


సూర్యనారాయణుడు


చంద్రుడు